# పద్మిని
# పుష్పజాతకము

కృతికర్త:—
చెల్లపిల్ల బంగారేశ్వరశర్మ.
బి. ఏ. బి. యిడి.,
పురపాలకోన్నతపాఠశాల, నరసరావుపేట.

స్వతంత్ర భారతీ ప్రచురణములు
నరసరావుపేట.

మద్రాసు ప్రభుత్వాస్థానకవి

బ్ర॥ శ్రీ॥ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి

# అభిప్రాయము

ఓం

శ్రీ మత్పరదేవతాయైనమః

చిరంజీవి చెళ్లపిళ్ల బంగారేశ్వరశర్మ విరచితమైన - "పద్మిని - పుష్పజాతకము" అను నీ రెండు ఖండకావ్యములను, నా వృద్ధాప్యకారణంగా అక్కడక్కడ పరిశీలించి చూచినాను.

శైలి ధారాళముగా నున్నది. కథ కల్పితమైనదగుటచే నొకమాదిరి క్రొత్తదనములో నడచినది. భాష నిర్దుష్టముగను, కుంటువడకుండను సాగినది. ధారాళముగా జాను తెనుగునున్న, అచ్చటచ్చట సంస్కృతమున్న ఉపయోగింపబడి ఈ చిరంజీవి భాషాభివృద్ధిని సూచించుచున్నది. భావపూరితములైన యీ రచనలలో ఆధునిక విజ్ఞాన పరిచయము అందందు గోచరించుచున్నది.

ఇది సర్వవిధముల పఠనయోగ్యమైన ఖండకావ్యమని నేనభిప్రాయపడి దీని నుత్తమ తరగతులకు పాఠ్యగ్రంథ మొనర్పుటకై శిఫార్సు చేయుచున్నాను.

ఈ చిరంజీవి ఇతోధిక రచనలతో అభివృద్ధి బడయుగాక !

విజయవాడ
3—5—49

స్వస్తి,
చెం॥ వేం॥ శతావధాని.

# పరిచయము



ఇందు రెండుఖండకావ్యములు గలవు -
'పద్మిని' 'పుష్పజాతకము'

పద్మిని కలావంతునిచెల్లెలు తేజోవంతుని వలచినది. కలావంతుఁడు, తేజోవంతుఁడు హరిగాథ నధికారుల బహుమానము నొందువాంఛతో వ్రాసిరి. కలావంతునివ్రాఁత పురాణశైలి గలిగి ప్రజల మెప్పింపఁ జాలినది. తేజోవంతుని వ్రాఁత యాధునిక వైజ్ఞానిక భావసంపత్కరమయ్యును ప్రజలచేఁ బూజానర్హముగ నెంచఁబడినది. తేజోవంతుఁ డీర్ష్యాపిశాచ మందీకృతబుద్ధియై తన్నువలచిన పద్మినిని, ఆమె యన్న వ్రాసినపొత్తము నపహరించి తెచ్చిపెట్టు మనికోరెను - ఆమె యాకూరకార్యమును జేయలేక, ప్రియునివాంఛను ద్రోసిపుచ్చఁజాలక యాత్మహత్య గావించుకొనెను. తదుపరి తనవివాహము జరుగనున్నసమయమునఁ దేజోవంతుఁడు తొల్లితావలచినపద్మినిజ్ఞప్తికిరాఁ దొల్లి తామిరువురుకలసితిరిగిన పద్మాకర ప్రాంతమునకుఁబోయిచచ్చట దొరకిన పద్మపత్రమును బఠించి తనవలనఁ బద్మిని మరణించెనని పశ్చాత్తాపపడి తనపాపము నశించుటకుఁ దా నాజన్మాంతము బ్రహ్మచర్యదీక్షవహించుటకు నిశ్చయించుకొనెను

పుష్పజాతకము—— ఇందు హైదరాబాదునుండి వచ్చినవారు పడినకష్టములు వారు తుట్టతుదకు నదృష్టవశమున

దమ దేశమును చేరికొనఁ గలిగినవిధము — పుష్పముపై నారోపింపఁబడి వర్ణింపఁబడినవి. దీని నాంగ్లమున వితతరూపకరచనము (Continued metaphor) అందురు.

ఈఖండకావ్యములరచయిత శ్రీబంగారేశ్వరశర్మగారు; నాకు చిరపరిచితులు. 'సుమతి' యనునామాంతరము గలవీరి 'బ్రహ్మపురాణము'ను అముద్రితమును ఇదివరకే వీరు చదివివినిపింపగా విన్నాను. వీరికవిత్వమును గురించి మద్రాసుప్రభుత్వాస్థానకవిశేఖరులు, శతావధానులు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు వ్రాయఁగా నేను మరల వ్రాయఁబూనుట సాహసమే యగును. వీరి ఈఖండకావ్య సంపుటి రసజ్ఞులైన పండితకవిపుంగవులకు, ఆధునికకవిసత్తములకు, సమానముగా సంభావ్యమగునని ఆశించుచున్నాను.

నరసరావుపేట
5-5-1949

నాయని సుబ్బారావు,
ప్రధానోపాధ్యాయుడు,
పురపాలకోన్నతపాఠశాల, నరసరావుపేట.









శ్రీ మహాక్షేత్రజమంతివాయుజకవి
శ్రీపార్వతీ భాస్కర
నామస్తోత్రముఁ జెప్పి సత్కవివితా
నధ్యానముంజేసి ప్రా
జామాన్యుం గుణ మత్పితం దలఁచి సో
పాభాష మాయమ్మ స్వ
ర్ధామాలంకృత నెంచి పద్మినిని సం
ధానింతుఁ గావ్యంబుగన్.








మ॥ సుఫలంజిల్కు కవిత్వము న్నఅపు తేజోవత్కళావంతులన్
బుధవర్యుల్ తమ పత్త్రికమ్మునన, సువాగ్బోధమ్ముఁ జూపించి య
వ్విధి రాణిక్ హరిగాథలో నెఱపి సంప్రీతాత్ములం జేయుచో
నధికారుల్ బహుమానమిత్తు, రను పల్కాలించి ధీరాత్ములై

చం॥ ఇహము పరమ్మునుం గలుగు నీ హరిగాథ రచింతుమేని యం
చు హితులు సర్వలోకగుణ శోభిత విజ్ఞత నొప్పి కావ్య ని
ర్వహణమునందు నిద్దఱును శ్రద్ధవహించిరి; తచ్చరిత్ర సం
గ్రహముగ వ్రాయువారలకుఁ గల్గవె వాక్కులతారతమ్యముల్

తే॥గీ॥ వారు వారు రచించిన పద్దియములు
సరస భావగభీరతా స్ఫురణ గలిగి
యసమ కావ్యకన్యా సృష్టియందిరువురు
నిపుణులని నిరూపించు సందియము లేక

చం॥ లలితవచో విధానము నలంకరణాది సమస్త సంపదల్
గలిగి పురాణ వాఙ్మయుల కౌశలితోడఁ గలావనాఖ్య కా
వ్యలలన సొంపు పెంపుమెయిఁ బ్రస్ఫుటమాధవ భక్తియుక్తయై
యలరెఁ బురాణసత్యము బహుల్యామగాథ లుదాహరించుచున్

కం॥ అందలి యాశీర్వచనపుఁ
జందము భగవత్పురాణ సత్య స్ఫురణన్
బొందు పఱుతుఁ జదివి మహా
నందమ్మును బొందుదురు జనమ్మను నాసన్

తే॥గీ॥ "కాళి యాహికి గరుడుని కాలితాపుఁ
దనదు నడుగుల కలిమిఁ బాయునటుఁ జేయు
వరదుఁడాశ్రితజన పక్షపాతియైన
యసురవైరి మిమ్మెపుడు గాపాడుఁగాక!"

ఆ॥వె॥ ప్రొద్దు పొడుపు మొదలు ప్రొద్దు గ్రుంకుదనుకఁ
గైత మెఱుఁగు దిద్దు కలము మేటి
సుద్దతోడి ఱాతఁ బెద్ద వేలుపుబొమ్మ
సిద్ధ పఱుపఁ జాలు శిల్పికాఁడె!

ఆ॥వె॥ కాగితమ్ముపై సిరా గిలికి కయిత
కన్నెపుట్టు నెఱపు కవివరుండు
తమ్మియాకు పయినఁ దగునూపిరి పసరుఁ
జిలికి లచ్చిఁ జేయు నలువగాఁడె!

చం॥ పలుకుల యింపు వ్రాత చెలువమ్ము కలంత జనింపకుండు మే
ల్తలపుల పెంపు పాముల దాపున వ్రాలి పదార్థమిచ్చు స
ల్లలిత వినూత్న శైలి నృపలాలిత వాఙ్మృదు శయ్యగల్గి ని
ష్కలుషముగా రచించెఁ దన కావ్యము రెండవ సత్క
వీంద్రుఁడున్.

మ॥ ఘన విజ్ఞాన పదార్థ శాస్త్రి వినుఁడై కావ్యమ్మునన్ జ్ఞాన క
ల్పనముల్ నిల్పి పురాణసంగతులఁ బైబైఁబూన్చి గాథాంతరం
బు నలంకార విశేష వాగ్వైభవ సంపూర్ణమ్ముగా నూత్న భా
వ నిధానమ్ముగ వ్రాసె నైజగుణ సంపన్నమ్ముగాఁ బ్రీతుఁడై.

కం॥ అందలి ప్రార్థన పద్యముఁ
గ్రిందున నే నుదహరింతుఁ గేవల కవితా
నందమ్మె కాక జ్ఞానము
నందించును బాలకాళికదె మధురమ్మై.

కం॥ "ఇనుము నికెలు కోబాల్టం
టు నయస్కాంత మ్మొటుల నటు తరతమ గతుల్
దనరఁ ద్రిగుణముల నంటు భు
వన మోహన దివ్య రూపవంతుఁ దలంతున్"

శా॥ తేజోవంతుఁడు ముందుగా వినిచెఁ దత్కృత్యర్థ సాకల్యమున్
నైజ ప్రస్ఫుట ధీవిశాల కవితా నానా విధానూన వా
ణీ జన్మస్ఫురణమ్ముగాఁ బ్రకృతిరాజ్ఞీ కీర్త నాధారమై
శ్రీ జానిం బ్రకటించుగాథను హితశ్రేష్ఠుండు మోదింపఁగన్.

తే॥గీ॥ "ప్రకృతి నవనవ భావ సంపర్క మహిమ
మృదుపదాలంక్రియాపూర్ణ వృత్త రచన
సర్వజన మనఃపూర్ణ రంజన కరమ్మై
సదమల పదార్థ విజ్ఞాన జనకమగును."

తే॥గీ॥ అని కలావంతుఁ డర్థ వద్వ్యాఖ్యఁ జేసి
హితుని నలరించెఁ; దనకృతి నతనికి విని
పించె-భగవత్పురాణ సముచిత మృదు
పద సమాస విభూషిత పద్యచయము.,

మ॥ "హరి చారిత్ర సమర్థ భాగవత భక్త్యావేశముం బండితో
త్కర నిత్య స్తవనీయ కావ్యరచనా కౌశల్యముంగల్గి సా
మరులైనన్ విని సంతసించి కడు సంభావించు గాథా విధా
న రసోద్రేకముఁ దెచ్చు నీదుకృతి సంధానమ్మె సామాన్యమే"

మ॥ అని తేజోవదభిజ్ఞుఁ డుత్తమ కృతి వ్యాఖ్యానముంజేసి యం
దునఁ గన్పట్టు పురాణశైలి విని సంతోషించి తన్మిత్రుఁన్
వినుతించెన్ విమలాంతరంగుఁడగుటన్; వ్రేఁనైనయీ వ్యాఖ్యాగుణం
బునకుం దావు నొసంగకుండెడి జనుల్ పూజ్యుల్ ధరా
మండలిన్.

చం॥ నరుఁడు గుణాఢ్యుఁడై హిత జనమ్ముల వాక్యముల నాలకించి దు
ర్భర దురహంకృతి ప్రకట భంగుల స్వార్థపరత్వమూని తీ
వరమగు స్వాభిమానమున బంధుల మిత్రుల నెంచఁబోక మ
చ్చరమను గాలిసోకి చెడు చైదములం బొనరింపకుండు నే!

కం॥ హరికథల రెంటి వినియం
దఱును గలావంతు వ్రాత నవరసభావ
స్ఫురణముఁ గలిగి మధురపద
భరితంబై యున్నదనుచుఁ బలికిరినతులై.

కం॥ తేజోవంతుని వ్రాతన్
సాజంబగు ప్రకృతి భావ సంపద గలుగం
గాఁ జూడఁజాల కెల్లరు
పూజానష్టునిగఁ ద్రోసిపుచ్చిరి వానిన్.

"సోకుమాకల గొంగపోకడ యను నొడల్
పుడమిపైఁ బుట్టించి పొలుపుఁ బెంచి
తెనుఁగు నుళ్లను విదల్ దిద్ది తీర్చిన రంగు
పూలకోకను మేనఁ దాలిపించి
క్రొంగ్రొత్త తలఁపులన్ కుందనంపుంగాసు
లల్లు త్రాడఱ్ఱున నలరనించి
యసలైన బత్తియన్ పసగల్గు కస్తురి
బొట్టు నెన్నుదుట మేల్పొట్ట నుంచి

తే॥గీ॥ పద్దియమ్ముల రతనాల పంటనిచ్చి
కైతయను నాదు ముద్దుల కూతుఁ దెచ్చి
పెద్దవారలఁ బిల్చి దీవింపుఁడనిన
వెక్కిరించుచు నున్నారు వెక్కసముగ.

ఉ॥ ఇంతటితోడ నాదుకృతి కించుక లోపముగల్గదంచు నే
నంతఁదొలంగి కాలమను వాహిని నీదుచునూఁకుందునా?
స్వాంతములోని నా పరిభవ వ్యథదీఱఁ బ్రజాంతరంగ వృ
త్తాంతము మాఱిపోవుకృతి తన్వి సృజింపఁగఁ బంతగింతునా?

తే॥గీ॥ కాలగర్భమ్ము కృతి జన్మ కారణమ్ము;
కావ్యకన్యకా పోషణ క్రమము జరుపు
లోకము; యశస్సుగునది నిల్చుటకుఁ దావు;
అకట దుర్విమర్శకులు మారకులు కృతికి.

ఉ॥ నా చెలికాని కబ్బము జనమ్ముల మెప్పుగడించి నన్ను దో
బూచుల నానాఁటి హితముం దలపింపఁగఁ జాలు భావముల్
లేచు నెడందలోఁ బ్రతిఫలించు గుణమ్ముల వాసిఁజేసె నే
నాచిర సౌఖ్యముఁ హితజనమ్ముల పాలొనరింపఁ జెల్లునా?

చం॥ అతనికి సత్కవీశ్వర సమర్థ యశఃపరిధాన సత్కృతి
ప్రకతి లభించుచున్నదను పల్కునకెంతయు సంతసింతు నా
యతుల వినూత్నభావ సముదంచిత కావ్యతనూజ యర్థ స
త్కృతి నెడఁబాసి యుండుటకు నేమరపిల్లకయుంటసాధ్యమా?

ఉ॥ నాప్రకృతి స్వరూప రచనా సముదుజ్జ్వల కావ్యసృష్టిలో
క ప్రథితమ్ము గామికి వికారముఁ జెందియుఁ బూర్వభావ దృ
ష్టి ప్రకటమ్ముగాఁ గృతి రచించి జనస్తుతిఁ బొందఁగోరినన్
బ్రప్రథమమ్ము మత్ప్రకృతి భావసమున్నతిఁ గోలుపోవలెన్.

ఉ॥ ఊరడి యుండరాదు; పరమోత్తముఁడౌ చెలికానికిం బ్రతీ
కారము చేయునట్టులుగఁ గన్పడరాదు; ప్రజానుకూల వా
గ్భరవదుత్తమప్రకృతి బంధుర కావ్యము పూర్వభావముల్
కూరిచి వ్రాయు త్రోవలోనఁగూడవు; నేనిఁక నేమిసేయుదున్?”

కం. అని యని తేజోవంతుఁడు
ఘనతర దీర్ఘ ప్రశాంత కాల సమాలో
చనమున మునింగి మాయా
వనీ దురభిమాన వికృత వర్తన మతియై,

ఉ॥ హెచ్చిన మచ్చరమ్మున సుహృద్వరు సోదరియైన పద్మినిన్
నిచ్చలు తన్ను హృత్కమలముల నేతగ నెంచుచుఁ బూజసేయు నా
నెచ్చెలిమాటుఁబుచ్చి తన నేస్తపుఁజూపుచు మెచ్చుకొన్నచో
మ్రుచ్చిలి తెచ్చియిచ్చుఁ గృతిముద్దియయంచుఁ దలంచె
దుష్టుఁడై



# ద్వితీయ దశము





తే.గీ॥ అది వసంతర్తు వారంభమగు దినమ్ము
సారసాప్త సందర్శన సమయమాది
యధిక తమవృత్త పరిధియం దర్ధభాగ
మప్పటికిఁ జుట్టివచ్చె భూవ్యాస రేఖ.

ఆ.వె. కలిమిలేములట్లు, వెలుఁగు సీకటులట్లు,
రాకపోకలటు, పరస్పరముగ
స్థాన చలనమొందె జ్యాధోగ్ర బిందువుల్
ప్రకృతి సౌష్ఠవమ్ము బయలు పఱుప.

ఉ॥ వేలుపుఁ దేని డాలుమొన వ్రేటుల వెల్వడు గైరికద్రవం
బో లసమానభానుఁ దమ మొంచినఁ బాఱునసృగ్విధంబొ ప్రా
చీలల నోదరస్థవిధు చేటుగ నీచెసకంటి యెఱ్ఱయో
నాలలితంపు సంజ నరుణస్థితిమించెను బశ్చిమమ్మునన్

కం॥ పద్మిని నాఁ బిలువంబడు
పద్మాక్షి గృహమ్మునుండి పఱతెంచెను ద
త్సద్మ ప్రాంత కుసుమవన
పద్మాకర తీర విహృతి పరతంత్రమతిన్

చం. జలకములాడ నెంచి జలజాతగృహమ్మున కేఁగుఁదెంచి యం
దలి తెలి నీటఁజూచి ముఖ తామరసప్రతిబింబ మందసం
చలన రహస్య ధర్మము నిజ ప్రియసత్కవనైక ధర్మమున్
దలఁపున నిల్పఁబద్మిని వనమ్మున డిగ్గెఁ బ్రియాభిలాషియై.

శా. దేహారోగ్యకరమ్ముగా మలిన ముక్తిం జేయు త్వక్ప్రక్రియా
వ్యాహారంబనుకూలమౌటకు మెయిన్ వ్యాపించు స్వేదమ్ము వా
బాహూర్వంగక ముఖ్యసంధి పరిశుభ్రత్వమ్ము సంధిల్లఁగా
దేహస్నానమొనర్చె సబ్బునురుగుల్ దీప్తిన్ బ్రసాదింపఁగన్.

ఉ॥ చక్కని బంతిపూమెఱుఁగు సన్నని నేత పసందుచీరఁ బెం
పెక్కిన పైఁడితళ్కుల మెయింబొసగించి గృహమ్ముఁ జేరె లో
నెక్కొనియున్న మోహమున నెన్నడ వేగిరపాటుదోపఁ బె
న్మక్కువఁ జూడవచ్చు ప్రియు మంజులవాక్కుల కాసఁ జేయు
చున్.

కం, కుడి యెడమ తారుమారుగఁ
బడియుండిన యట్టి తనదు ప్రతిబింబంబున్
దడయక యద్దంబందునఁ
బడఁతి గనుంగొనుచు నెఱుల పాపిటఁ దీర్చెన్ .

కం॥ కుడినుండి యెడమ కేనియు
నెడమవయిపునుండి కుడికి నేనియొకటియై
యుడరు తననుదుటి నడుమన్
బడఁతి మృగమదమ్మునుంచెఁ బ్రతిఫలదృష్టిన్.

తే॥గీ॥ సౌష్ఠవంబైన తనమేని సరణిఁదోఁచు
దర్పణ ప్రతిబింబ సౌందర్యమెసఁగ
బరువుగాఁ గానిపింపని పైడితొడవు
లొడల నెల్లెడనించె నాయువిదమిన్న.

కం॥ నింగిని ముట్టు ముదముతో
సింగారముల నెఱపికొని చేతఃప్రియయై
శృంగార నైషధమ్మును
శృంగారవతీలలామ చేకొనియుండెన్.

చం॥ అలఘు కవి ప్రణీతమగు నందలిగాథఁ దలంచికొంచు ము
న్నల దమయంతులొండొరుల నాణెపునేలి గొనాలవిన్కలిన్
వలపుఁ దలంపులందవిలి నాఁటిక నేనును నాప్రియుండు క
న్కలిఁ బ్రియమున్ వహించుటది నైజము నుత్తమమంచు
నెంచుచున్.

తే॥గీ॥ నిండు జవ్వని కిచ్ఛ జనింపఁజేయు
నాప్రబంధ శృంగార రసాత్మకమ్ము
లయిన పద్యరత్నాల నోరారఁజదివి
కొనుచుఁ గూర్చుండె నామె జవ్వనము పండ.

శా॥ ఈలోనన్ సమయమ్మొదగ్గఱుట నయ్యిందీవరాక్షీప్రియుం
డేలాగైనఁ బ్రియున్ నిజప్రియముచే నిష్టాప్తి సంధాయికన్
లీలామోదిత నాయికన్ సలిపి సంధింతున్ మదీయావమా
నేలాజాతవిపాటనమ్మనుచు నష్టైతెంచె నచ్చోటికిన్.

మ. దరహాసాంకుర భాసమానముఖపద్మమ్ముల్ తటిద్వల్లికా
స్ఫురదన్యోన్యకటాక్షవీక్షణములున్ బూర్ణక్రమోత్సాహమున్
గరసంకర్షణముల్ బయల్పఱుచుఁ దత్కాంతాకాంతాపర
స్పర సందర్శన సంజనత్కౌతుకవిభ్రాంతి ప్రదానందమున్.

మ॥ చెలికై సేసిన పేకుకట్టపని కుర్చీపైనఁ గూర్చుండి క్రొం
దళుకుంబంగరువన్నె యట్టుగల పాత్రంబొండు పూబోణిచే
తులలోఁగాంచి యతండు కాంత! నినుసంతుష్టాత్మఁగావించునిం
దలిరాట్పుత్రిక శీలమద్భుతముకాదా! యంచనెన్ నవ్వుచున్.

చం॥ నగుమొగమున్ నటించుతననాయకుతోఁ బ్రియకాంత నిక్కమే
యగు దమయంతికై తవనలాకృతులూనిన వేల్పుఁ బెద్దలం
దుఁగల నిజప్రియున్ దెలిసి నోములునోచిన పూలదండ వా
నిగళమలంకరించి సురనేతను నివ్వెఱపెట్టెనంచనెన్.

సీ॥ "వేల్పుల ముప్పూర బిడ్డలుగాఁజేసి
తనదు పాతివ్రత్య ఘనతఁజూపె.
జముని వెంబడిఁబోయి జాలిపుట్టఁగఁబల్కి
మగనియూపిరిఁగొంచు మఱలివచ్చెఁ

జెఱఁబెట్టిన దురాత్మునణఁకించి శిఖిఁజొచ్చి
   రమణునమ్మించి మోదముఘటించె
భర్తృసూనృత వాక్పరిభావమ్ముఁ బ్రకటింప
   నన్యులయింట దాస్యమ్మునెఱపె

తే॥గీ॥ నత్రియున వాసికెక్కు సంయమిని గృహిణి
సత్యవంతుని వలచిన సన్నుతాంగి
జనకుఁడను నేలఱేఁడు పెంచిన మహీజ
చంద్రమతి నాయశముఁగొన్న చారుగాత్రి.

తే॥గీ॥ ఆమహాపతివ్రతల ధర్మైకబుద్ధిఁ
బొగడుచుండుఁ గావ్యమ్ములో పూవుఁబోణి!
అట్టి యొప్పులకుప్ప యీ యన్నుమిన్న
భీష్మకావనీపాలక ప్రియతనూజ.

తే॥గీ॥ మంచిగొనములకిక్కయౌ మచ్చెకంటి
సచ్చరిత మీవుపఠియించు జాడఁజూడఁ
దద్గుణగణానుసరణమ్ము త్వదనుకూల
వాంఛితమ్ము కానోపునో వాలుగంటి.

తే॥గీ॥ శీలవతి నిన్ను రమణిగా స్వీకరించు
భాగ్యమబ్బునయేని మత్ప్రాగ్భవకృత
సుకృతము ఫలించు” నని మనస్సునఁగలట్టి
తలఁపు వెలువడనీక యాతండువలికె.

చం॥ "నలువ నెలంత పుట్టువుదినమ్మగు పండువు వీనుదోయికిం
జెలి కలకండకొట్టుపాడి తియ్యదనంబు పఠించునాల్కకుం
గలుములచెల్వ చెల్వని గొనమ్ములఁగూర్చిన నీదువ్రాత; నీ
తలఁపుల మేలికూర్పు విశదమ్మగుచున్నది కైతవ్రాతలో.

తే॥గీ॥ అట్టి కవివైన నిన్ను జేపట్టునాఁడు
నాదు తొలిబామునోములగాదె విత్తు
లెల్ల ముమ్మరమ్ముగ ఫలియించుఁగాదె"
యంచుఁ జెలికానితోఁ బల్కె మించుబోణి.

ఉ॥ నీలపుటక్కరాలపస నించుసిరా మెఱుఁగొప్పుకొప్పుదా
నా! లలిపుట్టి నీయెడఁదయందలి మక్కువలో తెఱుంగని
ల్లాలివిగా ముదంపడుటకన్న రచించిన కబ్బమీవు నా
మేలుఁదలంచి తెచ్చి యిడుమీయనె నాతఁడుగూఢ భంగిగన్.

తే॥గీ॥ బూదెగుమ్మడి యుపరకర్మాదులందు
నుపకరింపని కతమేమి యున్నయదియొ
పారిజాతవృక్షమ్ము దివమ్మునుండి
యవనికరుదెంచుటందు రహస్యమేదొ

తే॥గీ॥ ఎఱుకవాండ్రకు బొటనవ్రేలించుకంత
యుపకరింపని కతమేమి యున్నయదియొ
యన్నకును జెల్లెనకు మధ్య నట్టి యీర్ష్య
నరసి పద్మిని దేనిఁజేయఁదగవకును?





# తృతీయ దళము



చం. చెలువుని కోరికం జనువు చిత్తములేక తదీయ సన్నిధిం
బలుకఁగనోడి యప్పటికి మౌనముఁదాలిచి నేఁడుగాని నే
డ్కాలిపి మెదడుఁ బూవిలుతుకోలలనాటికి నేడి యున్న నా
తలతల సింటిపొంగనసు దంటతనమ్మున దొంగలింతునా?

తే.గీ. అనుచుఁగామొయిళ్ళొలయు గగనము వానఁ
గురియు తెఱఁగునఁ గన్నీటిఁ గ్రుమ్మరించు
నగలనిండిన యెడఁదతో మగువమిగులఁ
బొగిలె నగకాని కోరిక తగవుకామి.

తే.గీ. ఎడఁద కాగితమ్మున లిఖియించికొన్న
చెలివలపు టక్కరమ్ములం దొలఁగఁజేయు
జాలిగుండె చెల్వునికో రెక్కరబ్బగుతన
పనులఁ బొనరించుచుండెను బంతగించి.

ఉ॥ "పచ్చనివింటిజోదునను బంతముతో నెదిరించిమించి పే
రుచ్చులఁగట్టివైచి పరమోత్తమధర్మము రిత్తవుచ్చఁగా
మచ్చికఁజేయుచుండెఁ బెనుమైకముఁగ్రమ్మను నెమ్మనమ్మునన్
ముచ్చటఁదీర్చి నాప్రియుని ముంగటనిల్చుట పాడియౌనొకో!

ఉ॥ కాదని త్రోసిపుచ్చ పయిఁగార్యము శూన్యము; అన్యమానవ
స్వాదువచోమృతాస్వాదన సంచితపాతకదూర చిత్త తా
మోదముతోడ జీవితముఁబుచ్చుట కష్టము తొల్తనొక్కనిన్
నాదుమనమ్మునందిడి యనంతర మింకొకనిన్ వరింతునా ?

చం॥ వలపుఁదలంపులన్నిలుపు పైనవివాహము మంచిదంటలోఁ
గలుగుననర్థమెల్ల నెఱుఁగంబడెఁ బెండిలిఁ జేసికొన్నపై
వలపుఁదలంపులన్ నిలుపు వారికిఁగల్గునె యిట్టిదుస్థితుల్
తొలుత మహాష్టేర్పడుచు త్రోవలుతప్పుటముప్పులేర్పడున్.

ఉ॥ పెండిలి యింతదాక జరిపింపనివంక ఘటించిమోదుగా
నిండుపెడందలోఁ దొలుతనిల్చిన మక్కువ రూపుమాపి నేఁ
గొండొకవానిఁగైకొనుటగూడ ఘటిల్లుట దుర్భరంబ యీ
గుండియ లాగివైచి పెఱకుండెఁదగిల్చెడి యంత్రముండునా ?

చం॥ ఇదియునుగాక తన్మిషపయిన్ వగకానిఁ ద్యజింపఁబాడియా
పదుగురిలోనఁ బల్కని నెపమ్మున నాడినమాటఁ దప్పిపో
వుదురొకొ ధర్మవాజ్ఞిరతబుద్ధిఁ జరించుమహాత్ము; లింతమున్
బదుగుము లేమియే కద వివాహము కామికి లోటుమక్కువన్.

మ॥ ఎటులో డెందముఁ ద్రోసిపుచ్చి తగవౌనేర్పాటు వోనాఁడి ము
చ్చటదీఱన్ బెఱవానిఁబొందుటకు నాసల్ సేయుదుంబోయుతం
డటులే వేఱొక దుర్ఘటక్రియను జేయన్ నన్ను వాంఛించు మీ
దట నైరాశ్యమునిండి పొంగినయెడందం గ్రుంగిపోదుంగదా!

ఉ॥ అందఱు వానియట్టు లనయంబగు కార్యముఁ జేయఁ బంతురే
యందము; లోకసమ్మతవయ ప్రతిపత్తి గలట్టి వానిదా
చందమెఱుంగు టెట్లు; మనచక్కటికాతఁడు వచ్చు టెట్లు; తె
గ్గుండలపోసి మేత్తలచు కొమ్మను మాటలు రిత్తవోవునే?

ఉ॥ పాడిఁదొలంగి యింటఁగలవారలనందఱఁ గన్నొఱంగి తా
రాడుచునన్న వ్రాతలు గలట్టి మెఱుంగు పసిండి పెట్టియన్
జాడనెఱింగి యేరయినఁ జక్కటికిం జనుఁదెంతురంచుఁ దూ
గాడు నెడందతోఁదెఱచి కబ్బము ముచ్చిలి యిత్తువానికిన్.

ఉ॥ దానికి సంతసించుచు సతండు ననుంగవుగింటఁజేర్చి పొ
త్తానకుఁ జిచ్చుఁబెట్టి సరదాపడుచున్ సరసీరుహాస్త్రి లీ
లానవమాధురీ లహరులం దలమున్కలువెట్టుచుండ నా
లోనను నేనెకందుచు విలుప్తమతింగడుఁ గ్రుంగిపోవుదున్.

చం॥ ప్రవిమలవిష్ణుగాథ కనరామిఁ గలంగినయన్న దాని మ
కృవఁ జెలికాని కేనిడుటకుంగల యక్కఱలోఁదలంచి క్రో
ధవశత నొవ్వనాడునను; దబ్బఱలాడుచు బూకరించుచున్
ధుర్వమయెఱుంగ నేనని నిరూపణముంబొనరించు టెట్టులో?

ఉ॥ ఇంతఘటిల్లియుండునని యెంచినలోకము మమ్మునిర్వరన్
వింతమృగమ్ములట్టుల గణించును; గోమల కావ్యకన్యకన్
మంతనమందు మేము పెనుమంటలఁబుచ్చిన కారణమ్మునన్
హంతకులట్లు చూచునుగదా కరుణారహితాంతరంగమై.

ఉ॥ భావజభూరి చాపగుణ బంధురకంపన ముక్తసంచలత్
పావక సన్నిభాస్త్రముఖ దగ్ధమతింబొనరించితింతయుం
చీవల నన్ను నీర్ష్యను జయింపఁగలేని కవీశ్వరుండవౌ
రా! వగకాడ! యంచవల నాతని సజ్జనులాడిపోయరే.

ఉ॥ వేలకొలంది తేళ్ళుబొడిపించిన యట్టులు చాల నెజ్జుగాఁ
గాలినసూదివాడిమొన గంటులుగొట్టినయట్లు అంపమున్
వాలుగఁ బట్టికోసినటుఁ బ్రాణముఁబాయదె నాశరీరమా
కాలకఠోరదుర్విష సఖంబగు నిందకుఁజిక్కి పొక్కుచున్

సీ॥ వగకాని నగుమొగంబెగయించు మెఱుఁగు వా
ల్గనుదోయి చూడ్కులం గగుఁరుపొడిచి
యతనికోరికఁదీర్చ నక్కఱఁదలపోసి
యన్నఁవ్రాసిన పొత్తమపహరించి
నాదొంగతనములోన నొకింత యోజించి
నన్నన్నపలుకు నిందల సహించి
జనులాడు నెగ్గుల సైపఁగాలేక కృ
శించికృశించి నశించుకంటె

తే॥గీ॥ నేఁడె యీమేను ధర్మార్థ నిర్ణయమ్మఁ
జేయుపొంటెఁ దలంకి వర్జించుటొప్పు
వలపుకానికి నపకీర్తి తొలఁగిపోవు
నన్నకబ్బపుంగన్నె మేలందఁగలదు."

తే॥గీ॥ అనుచు నాగుండెఁ గల్పించికొని తలంచె
వలపు మున్నీటియలల కావరమెఱింగి
పద్మినీచారుగాత్రి దుర్భరవిషాద
కాలకూటమ్ము పొంగిన కడవయగుచు.

మ॥ నడుమన్ శుద్ధజలమ్ము పావనత సంధానింపఁ జుట్టున్ జనం
బడుగుల్ మోపిన జాఱునాచుపయికో నర్మ్యాత్మ జాతప్రభన్
బొడిగింపంగల నల్లజాల యమగుంబాల్పొప్పఁగాసారము
న్నడకంబిందియ సంపెటందనరఁగా నేతెంచె సన్మార్గమై.

ఉ॥ పావనతాస్పదంబయిన పద్మగృహాంగనకుఁ జుట్టునాచు పై
న్దీవియలల్లుకొన్న పగిదిన్ సుపవిత్రపథమ్మచుట్టు నీ
ర్ష్యా వివశాంతరంగ సహజాతములౌ మొనలెత్తుకంటకా
ల్లొప్పువడుంగదా ప్రకృతిఁబోలని త్రోవలు సృష్టినుండునే.

కం॥ తన పద్మినులఁ గనుంగొన
మనసై పద్మినియుఁ బద్మముంగళ సద్మం
బునుజొచ్చి పద్మపత్రం
బును చైగొని వ్రాసెఁ బద్యమును గొనగోటన్.

తే॥గీ॥ "అలకలావద్భవజ్యోత్స్న నపహరించి
పుత్రిన ల్లసణపుమంచుఁ బుండరీక
పుఁ బనిఁబూన్చు తేజోవంతు ముదితుఁజేయఁ
బద్మిని తనదేహమ్ము నర్పణమొనర్చె."

మ॥ అనుపద్యమ్మును వ్రాసిపత్రమునుమున్నత్యంత మోహమ్ముతో
సనుఁగుంజెల్వుఁడు తాను ద్రిమ్మఱిన కుంజాంతఃప్రదేశమ్మునం
దున గుప్తమ్మొనరించి క్రమ్మఱి సరస్తోయమ్మునన్ మున్గెఁబ
ద్మిని యాత్మార్పణ పుణ్యమార్గ విలసద్దీక్షాసముద్దండతన్.



# చతుర్థ దళము

తే॥ తల్లిదండ్రులు మిగుల వత్సలత నెఱప
నగ్రజాతులు నగ్రజ లాదరింప
ననుజులనుజలు తనపంపు లాచరింప
గృహమున మెలంగు పద్మినీ కీరవాణి

ఉ॥ సాపడు వేళకు న్నికటసంస్థితకామి సహోదరుల్ తదీ
యోపగతస్థలమ్ముల సహోదరిఁ గానక లోఁగలంగిలీ
లోపవనమ్ములన్ వెదకి యొండెడలంబరికించి చేరినా
రాపెను నాచుఁదీవియల యల్లికమించు సరోవరస్థలిన్.

చం॥ ఉదకముఁ ద్రావి త్రావి కడుపుబ్బియు నూపిరితిత్తులాగి వె
చ్చదనముఁ గోలుపోయియుఁ బ్రసన్నతఁదప్పిన మోము వెల్లనై
బ్రదుకున నాసలేని తమ పద్మిసి దేహము ప్రక్కబిందె క
ట్టిదుటఁ గనంబడెన్ జలము హెచ్చుభరమ్మునఁ జేసి తేలుచున్

మ॥ అగరే చెల్లెలు నీటిలోఁబడెనురా, ఆయుస్సు నిండించెరా
సరసీజాతభవుండు సోదరికిఁ గాల్జాటించెరా నాచు తోం
దఱయేమంత ఘటిల్లెరా జలమొకింతందేఱ సాయంత్రపుం
దటి నంచుక్ విలపించిరందఱును జింతాత ప్త చేతస్కులై.

ఆ॥వె॥ పేరఁ బిలిచిపిలిచి పెద్దపెట్టున నేడ్చు
వారి గోల విన్న వారలెల్ల
వచ్చి యచటి మరణవార్త నాలించి క
న్నీరు కొలఁకులందు నించినారు.

ఉ॥ అందునఁ బెద్దలగ్రజుల నగ్రజలందిలకించి మీరలా
ర్తిందిగ్రమింగి కర్మలొనరింపుఁడు చింతిలనేలొకో గతం
బుందలపోసికొంచు విధిపూన్కికి నడ్డుఘటిల్లునే పరం
పుందెరువేర్పరింపుడని పూన్చిరి వారలఁ దత్క్రియాగతిక్.

కం॥ దిగఁదాగివిన నెవ్వగతోఁ
దగుకర్మల జరిపిజరిపి తమయిలుసేరక్
నగరము జనులెల్లరకుక్
వగమిగిలెన్నాఁటి మరణవార్త వినుటతో.

శా॥ తేజోవంతుఁడు పద్మినీ మరణభాతిన్నాఁడె యాలించి ని
ర్వ్యాజ ప్రేమ సమగ్రమూర్తిని మదీయప్రేయసింబాసితిక్
నాజన్మమ్మున విస్మరింపఁదగునా నాపైన నాపద్మినీ
రాజీవేక్షణ చూపు ప్రేమనని యాక్రందించెఁ జింతామతిక్.

తే॥గీ॥ బంధుమిత్రాది హృదయాబ్జ పత్రలిఖిత
పద్మినీ రూపచిహ్న సంపత్ప్రదర్శ
నమ్మతోడుతఁ గొంతకాలమ్ముగడచెఁ ;
బ్రజల కాయమ సచ్చరిత్రమ్మెసొమ్ము.

శా॥ సూచింపంబడె నొక్కరోజునను దేజోవద్వివాహమ్ము; వి
ద్యా చాతుర్యముగల్గు నాకవి మనోవ్యాపారముం బద్మినీ
స్త్రీ చేతోగతమైన ప్రేమరసవార్ధిందీర్చి యానాఁడు త
ద్వైచిత్ర్యమ్మను వెల్వరించిన సరఃప్రాంతమ్ముఁ జేరంజనెన్

కం॥ తొలివలపు నిలుపు తలఁపులు
తలఁపున మొలకెత్తఁ గొలనుదాపున మున్నా
లలితాంగి తాను మెలఁగిన
చెలవులఁదిలకించె నతఁడు చెలకొనువగతో.

తే॥గీ॥ తాను బూఁదోట కరుఁదెంచు తఱులఁ దెలుపు
నుత్తరమ్ములఁ జెలియుంచుచుండుచోట
భ్రాంతిమైఁ జూడనతనికిఁ బద్మినీ న
ఖ లిఖితాంభోజ పత్రమ్ము గానఁబడియె.

తే॥గీ॥ దానఁ జెలి వ్రాసియున్న పద్యమునుగాంచి
నిలువునఁ గరంగిపోయి కన్నీరునించి
పొంగి పొరలివచ్చు వగ నాపుకొనలేక
యతఁడు విలపించె నిటు హృదయమ్ముఁ దెఱచి

సీ. "కందుకఖేలనక్రమ సంఘటిత జయా
నంద సంబంధ నినాదమందు
ఫలపుష్ప కోరక విలసితక్ష్మారుహా
రోహణ ప్రకటితోత్సాహమందు
రామాయణాది పురాణ సందేశ గ్ర
హణదృఢైకాగ్రలౌల్యమ్మునందుఁ
గఠినార్థ బోధనా కౌశల్య సంభృత
గురుపూజనార్థ సంతరణమందుఁ
తే॥గీ॥ దర్క వేదాంత నీత్యర్థ ధర్మశాస్త్ర
వాద సంగ్రహణ జనితాహ్లాదమందు
వెలువడిన మైత్రి ద్రోహ సంచలితమయ్యె
నకల యీర్ష్యాపిశాచ మాయాబలాన.
సీ॥ నిండుపున్నమనాఁటి పండువెన్నెల పోల్కి
మొగమున నెగయు చిర్నగవుతళ్కుఁ
దలఁపులో నలరారు వలపుఁజిన్నెలనెల్ల
వెలిఁజిమ్ము వాలుఁజూపులపసందు
ననువైన తఱులందు మనసార ననుజేరి
పలరించుపల్కుఁ దీయందనమ్ముఁ
గన్నెకుందగనైన విన్నాణము రవంత
పొల్లువోనీని చెయ్వుల మెలఁకువ.
తే॥గీ॥ లాతివారల మంచి తలంపులెల్ల
నెఱిఁగి నడయాడుచుండు నేర్పరితనమ్ము
నెఱపి వలపించె నను బద్మినీ లతాంగి
పుట్టి వలపీసునకు బలియయ్యెనాఁడు.

శా॥ ఒకకాలానఁ బురాణ ధర్మరచనం బుత్కృష్టమై సాఁగ వే
ఱొకకాలానఁ బ్రబంధనిర్వహణమత్యుత్సాహముంగూర్చ నిం
కొక కాలమ్మన ద్వ్యర్థికావ్యరచనం బొప్పారు లోకైకమా
న్య కథారూపము కాలభేదమునఁ బూజార్హం బనర్హంబునౌ.

ఆ॥వె॥ ఆదరించునొకఁడు దచ్చతెనుఁగు కైత
సంతసించు నొకఁడు సంస్కృతాన
సంస్కృతాంధ్ర శబ్ద సమ్మిళిత కవిత్వ
మిచ్చగించు నొకఁడీ జగాన.

మ॥ జన సంస్తోత్రసమర్హ కావ్యరచ నేచ్ఛాబుద్ధులై సత్కవుల్
ఘన భావమ్ముల వెల్లడించు కవితా కౌశల్యముంజూపి వ్రా
సిన కావ్యమ్ములలోనఁ గొన్ని సుజనస్వీకార పాత్రమ్ములై
వినుతింజెందును గొన్ని సర్వసుజనాపేక్షా విదూరమ్ములౌ.

కం॥ ఈసునఁ బుట్టిన ఖేదము
వాసిని దగ్గించుననుచు భావింపక నాఁ
డాసించితి విఖ్యాతిన్;
నాసర్వస్వమ్ము లిటుల వినాశమ్మాయెన్.

చం॥ హితునికిఁగల్గు గౌరవము నిచ్చమెయింగనలేక యీర్ష్యతో
నతని ప్రతిష్ఠ గంగఁబడ యత్నమొనర్చిన దుర్జనుండ ని
శ్చితమతి నన్నుగోరుసరసీరుహలోచన నీటఁద్రోసి క్రూ
రత నొడిఁగట్టికొన్న కవిరాక్షసుఁడన్ యమశిక్షకర్హుఁడన్.

కం॥ నేఁజేసిన పాపమెడల
నాజన్మాంతము వివాహ మాడక యా నీ
రేజాక్షిని దేవిగ నెదఁ
బూజించుచునుంట యర్హ పుణ్యపథమ్మౌ."

తే॥గీ॥ అనుచు నిశ్చయంబొనరించికొని యతండు
నాఁడు మొదలు వివాహసంధానదృష్టి
వదలి సువిశాలభావసంపదల నిలిపి
జీవితముఁబుచ్చె నానంద చిత్తుఁడగుచు.





11వ పుట 7వ పంక్తి తప్పు 'ఖచుఁదత్త'; ఒప్పు 'టిచెదుంద'






హైదరాబాదు విడనాడి హైందవాప్త
సోదిలనమ్ప్రభుజేరి, శాంతి నెలకొనిన
పిదప స్వస్థలమ్ము నదృష్ట విలసనమునఁ
బొందఁగ శ్రీగిరి కొందఱే పూవుపోల్కి.



చీడఁ బట్టిన కేతకీ క్షితిజమందు
సాటిపూవులు పడుచున్న సంకటమ్ముఁ
జూచి శోకమ్ముఁ జెందిన సుమ మొకండు
తనవఁ బ్రాణముల్ దక్కవన్ దలపుఁ బూనె.

## వాయుదశ

కేతకీపుష్పమనువాంఛ గృహమువదలి
కొదమ తుమ్మెదబారులఁ గదియవచ్చి
యెడఁద భయ సంభ్రమావస్థఁ బడి కలంగి
వేడినెత్తావి నిట్టూర్పు విడిచిపుచ్చె.

గాలి మెలమెల్ల సాగునాకాలమందుఁ
బూవు మ్రొక్కెను బవనదేవునకుఁ దన్ను
దుండగీండ్రను దొలఁగించి నిండుకరుణఁ
గావుమంచును బెనుజాలి గలుగునట్లు.

"నీదుపుష్పాడి గలిసిన నాదుకమ్మఁ
దనము చెడిపోవు నీవుపుట్టిన గృహమ్ము
నీకు నపకారమాయె" నం చా కఠినుఁడు
పలికె నంత నేతత్పుష్ప మలుగఁబోక.

"మిగులఁగమ్మని నెత్తావి మెండుకొనిన
నీదు మెయిపూతసోకిన నిముసమందు
నస్మదల్పజన్మాఘమ్ము భస్మమగుఁద్వ
దధికభారవత్సుగుణాగ్నియందు దేవ!

సుగుణవంతుఁడు దుష్టుని శుద్ధుఁజేసి
వానిఁదనలోనఁ గలిపికోలేని యెడల
నడవిఁగాచిన వెన్నెలయతని సుగుణ
మనఘ! ననుధన్యుఁ జేయుమోయయ్య" యనియె.

అన్యవాక్కుల సహితమ్ము నాదరించు
నభ్యసనమున్న దేవుఁడా యలుకుపలుకు
లెల్లనంగీకరించె; మిన్నేటితమ్మి
తావిపైకొన్న గాలులు వీవఁజొచ్చె.

## కుజదశ

కోరకిత గిరి మల్లికాకుజమునీడ
గాలిపాటునఁ బడియుండె నాలతాంత
మన్యచింతా సమాధాన మంతరించి
యాత్మచింతా సమాక్రాంతమాయెఁబూవు.

"ఫలముఁగోరని యుపకారపరుఁడవైన
నీవురక్షించుపగిది సంధించెనాకు
గంధవహుఁడిప్డు తేనెటీఁగలను నన్య
కాంక్షఁగలిగించి ననుదయఁగావు"మంచు,

తేనెటీఁగల గుంపులు తీయురాగ
మనతిదూరాన వినవచ్చెనంత నడలి
కేకలల్లాడు నాపూవు వృక్షమునకు
విన్నపంబొనరించె నిర్విణ్ణబుద్ధి.

నీకుఁగానాదు పూలతేనియల నీఁగ
లకు సమర్పింతునా యంచిలారుహమ్ము
కోపపడినంత శాంతమ్ముకుదుటుపడిన
సుమమువాడిన తనగతింజూపియనియె.

"నన్నురక్షింతువేని నీకొన్నినలకుఁ
దిరిగితేనెలువుట్టు సత్కృత్రికుసుమ
సఖ్యమబ్బును దీనదశా విషాద
దావదవతప్తనగు నన్నుఁగావుమయ్య."

అని సమాధాన పఱుచు నాయుడులను పలుకు
లాత్మ సంతృప్తిఁగలిగింప నవనిజమ్ము
తనదు మొగ్గలవికసింప బనిచెఁ దేనె
టీఁగలాప్పూల తేనెలఁదృప్తిఁగ్రోలె

## గౌరీదశ

ఈఁగలవలని వంతవోయిన సుమమ్ము
భూరుహచ్ఛాయ విశ్రాంతిఁ బొందుచుండి
తన భవిష్యద్దశంగూర్చి తలఁచి కొనుచుఁ
గుజమహాదశ గడచుటఁ గొంత యెఱిఁగె;

ఒక మృగేంద్ర మాదెస వచ్చుచుంటఁ జూచి
తనకు నిడుములు వరుసగాఁ దగులుచుంట
కధిక సంతాపమొంది దిక్కెఱయు లేక
యొక్కనిముసమ్ము కనుమోడ్చి యుక్తినెఱిఁగె;

సింహ వాహనఁ హృదయాబ్జసీమఁ జేర్చి
"గోరు చుట్టున రోఁకలిఁ గొట్టినట్లు
నలిగి పోవుచు నుండిన నన్నుగావు
మమ్మ! యోశాంకరీ!" యంచు నర్చఁజేసె.

ఆత్మ వాహన జాతికి నలుకవుట్టు
నను విచారమ్ముఁ దక్కిఁపూవునకు మేలొ
నర్పఁగోరి శరీరమ్మునను గలట్టి
బూడిదను గొంతరాల్చెఁ బూవుపయి నగజ.

సుమ విలాసమ్ముఁ జూచి సంభ్రమము పడుచుఁ
గేసరి శిరస్సునను దాని గీలుకొలిపి
యెన్నఁడును లేని సంతసం బెసఁగఁ జనియె
నిజ గుహావాసమును జేరు నియతిఁ బూని.

## నారదదశ

మార్గ మధ్యమ్ము నందు సుమమ్ము జాతి
పడియెఁ గాంతారమానవద్వయము మధ్య
నాడు ప్రియకిది మంచి కాన్కయనియెంచి
రిరువురును వేఱు వేఱుగా నెడఁదలంచు.

ఇల్లువదలుట మొదలుగా నింతవఱకు
వరుసగా నిడుమలఁ బడివాడియున్న
తత్ప్రసూనమ్మెదుటఁ గిరాతద్వయమ్ముఁ
గాంచి వగపాటు డెందాన నించినించి,

తొంటిరాజు లాపదలు చెందు తఱులందు
నను నయాచితలబ్ధ ధనమ్ము మాడ్కి
దర్శనంబిచ్చు నారదతాపసేంద్రుఁ
దలఁచి సంతన తద్ధ్యానఫల మనంగ,

చిన్ననాఁటినుండి గలట్టి చెలిమిఁ దలఁప
కాంద్రుగా నున్న కన్నెలయందుఁ గూర్మి
హెచ్చి యుండిన యాబుద్ధిహీను లంత
నొండొరుల డీకొనిరి పూవు నొందుకొఱకు.

రుధిరమాంసముల్ దొఱఁగు తీఱునఁ బరస్ప
రభుజబలములం జూపించి రణమొనర్చి
కొంత తడవున కిరువురు నంతకాల
యమ్మునకుఁ బోయిరి తమ దేహముల విడిచి.

## మిత్రదశ

చచ్చిపోయిన వారి మాంసమ్ము కొఱకు
గృధ్రములు పెక్కుగసివచ్చి పృథివి వ్రాలు
తఱి విరులు రెండు తొల్లిటి విరికిఁ బ్రక్కఁ
బడియె; నవి తొంటిచెట్టు పుష్పములె యౌట,

వానిలో వాని కత్యంత పరమమైత్రి
సంఘటితమయ్యెఁ; బ్రథమపుష్పమ్ము మిగిలి
న విరులఁ దదీయగాథ వినఁబఱుపుడని
వేఱు వేఱుగ నడిగె సంప్రీత మగుచు.

చీడఁ బట్టిన చెట్టును వీడి తాము
వచ్చియుండిన విధమెల్ల వరుసఁ దెలిపె
రెండువిరులును శోకమ్ము నిండుకొనిన
యాత్మ రక్షకపత్రాల యడలుఁ జూపి.

మూఁడు పూవులు తమకు రాఁబోవు నాళ్లు
జరుగు నెట్లని యన్యోన్య చర్చ జరుపు
చుండిన తఱిని మర్కటం బొకఁడు వచ్చు
చుండె సత్వరంబుగఁ బూవులున్న దెసకు.

తొంటి చర్చనుమాని యీద్రుమచరమ్ము
బాఱిఁదప్పించుకొను టసంభవ మటంచు
ప్రాణములు బిగఁబట్టి దుర్భర విపద్వ
శావశంబయి యుండె నాపూవులపుడు.

## హనుమద్దశ

సహజ చాపల్యగుణముతో సంచరించు
చుండు శాఖామృగమ్ము చేయు నపకార
మెఱుఁగ నేరక విభ్రమోద్వృత్తిఁ గలఁగి
పూవులొక్కింత తడవు సద్బుద్ధినెఱపె.

సకల భయవారణమ్ము రక్షాకరమ్ము
భూతభేతాళఢాకినీవ్రాతభీక
రాకృతి ధ్వంసకారణమ్మైన యంజ
నాసుతస్తోత్రపూర్ణదండకము చదివి,

"ఉనికి పట్టైన చెట్టునాశనముఁజూచి
దాని విడనాడితిమి విపత్కాంధిమునిఁగి
యిపుడు గట్టెక్కలేకుంటి మేము దేవ!
మమ్ముఁ దోవనుజూపించి మనుపుమయ్య!"

అనుచుఁ బూవులేకగ్రీవవినుతిఁ జేయ
రామభూపాలపాదనీరజయుగార్చ
నానిరతబుద్ధిమంతుండు జ్ఞానవంతుఁ
డైన హనుమంతుఁడంతదయార్ద్రుఁడగుచు,

తనదు వాలమ్మునుండి కుంతలము నొకటి
పంపఁగానది పోయి పుష్పత్రయమ్ము
గట్టివైచియుండెను; దలఁబెట్టికొని చ
నియెను దాని నాకోతియనిలజ మహిమ.

## ద్వాదశి

కపి తపోభూము లుండిన విపినమందు
సంచరించుచు నొక్కవృక్షమ్ము నెక్కి
జాఱవిడిచె శిరోగ్ర పుష్పత్రయమ్ము
సహజచపలచేష్టాక్రమాచరణబుద్ధి.

కుసుమసంపూర్ణమగు నొక్కకొమ్మ మధ్య
నిఱికికొని దైవసంకల్పమెఱుఁగ లేక
యప్పటికి శాంతితో జీవయాత్ర గడచు
కొఱకు ముక్కంటిఁ బూజించె విరులుమూఁడు.

అంతసాక్షాచ్ఛివుండు ప్రత్యక్షమైన
యట్లు తత్కుజచ్ఛాయ బ్రాహ్మణుఁడొకండు
బూదె పూసికొని విరులబుట్టఁబూని
తత్ప్రసూనాపచయబుద్ధిఁ దవిలినిలిచె;

పూవులీకొమ్మనున్నవి ముమ్మరముగ
ననుచుఁ గొమ్మఁజేపట్టి కోసెను విరులను
దాన మునుచిక్కికొనియున్న సూనమ్ములును
బుట్టలోఁబడె దైవసంపూర్ణకరుణ.

భూసురుఁడు వానిఁగైకొంచుఁబోయి పరమ
శివుని బూజించుచుఁదదదృష్టవశమునను
హాశివు శిరోగ్రమునసుంచె నా మదనను
మంత్రయమ్మును భక్తిసంపదలు వొదల.

## శివదశ

కాటిఁ జేఁడయ్యు భక్తులఁగరుణఁబ్రోచు
బూదెమెయివాఁడైయు భాగ్యముల నొసంగు
ననలనయనుఁడై దీనులనాదరించుఁ
గాలకాలుండు సిద్ధసంకల్పుఁడతఁడు.

కట్టునడిశంకకున కలంకారమైన
పూర్ణినదినాభివృద్ధిగాఁ బుష్పడియు సు
వాసనయుఁగల్గి శోభిల్లె వారిబిందు
వమల శుక్తింబడి మణిత్వమందు భంగి.

శివశిరోగ్రి పుణ్యావాస సిద్ధిఁజేసి
విరులుమూఁడును శివభక్తివిస్తరించి
"మాతృ వృక్షమ్ముఁజేరిచి మమ్ముఁబ్రోవు"
మనుచుఁబ్రార్థించె గౌరీమనోధి నాథు.

పూలప్రార్థన లాలించి భూతపతియు
భూతములఁబంచె నవనీజమునకు సుస్థి
తిఁ గలిగింపుడంచునవి యేతెంచి యచటి
చీడపుర్వుల నన్నింటిఁజెదరఁగొట్టె.

చీడపురుగుల్ నశించె సుస్థితిఘటిల్లె
బ్రోడుచిగిరించె నాకులు వాడమెఁ బెరిగె
పచ్చపచ్చగాఁ జెట్టు కన్పట్టసాగె
శివునియాజ్ఞకు నెదు రేదు యవనియందు?

## నందిదశ

భక్తులర్పించునంజలి ప్రతతికలరి
యెత్తునకుఁబదెత్తులు వరాలిచ్చుశివుఁడు
చిత్తమునమెచ్చి తన్ను బూజించుచున్న
మోడుపూవుల రక్షించు పూనికఁగొండి,

శివకటాక్షవీక్షణసుధాజీవనంబు
నభినవామోదకారణ మగ్గమై పుష్ప
వితతి పునరాగమక్రియావిహరణమ్ము
నైరపించు మదనవృక్షమందుఁబూల

నిలిపిరమ్మంచు నందితోఁబలికినంత
గౌరవాదరభావమ్ము గడలుకొనఁగ
నంది శివునాజ్ఞనెఱపు నానందమెసఁగ
వానిగైకొంచుఁబోయి వృక్షానఁబెట్టె.

కట్టువెంబ్రడుకబ్రతాడు చక్కవిడిపోయి
విరులు కొమ్మలయందుఁ జిగురులనడుమ
హత్తికొనియుండె శివమహత్త్వాతిశయము
కతన నటుగాక తదదృష్ట గతిగలుగునె?

దైవసాహాయ్యమున్న లతాంతములు కొ
లందిమాత్రము జీవముల్గలిగితిరిగి
వృక్షమును జేరికొనఁగల్గె విధివిధించు
జాతకఫల మ్మతిరహస్యసంఘటనము.

